# బాలలోకం





ఎర్రోజు సత్యం

ప్రచురణ :

శ్రీ త్యాగరాజ లలితకళా పరిషత్

కరీంనగరం

ప్రథమ ముద్రణ:
జూన్, 1980

ప్రతులు:
1000

వెల: రూ. 2-50

బొమ్మలు:
అగాచార్య

ముద్రణ:
శారద ప్రింటర్స్ కరీంనగరం



ప్రతులకు:

1. శ్రీ త్యాగరాజ లలితకళా పరిషత్, కరీంనగరం

2. ఎర్రోజు సత్యం, రాచర్ల బొప్పాపురం-505 305
తాలూకా సిరిసిల్ల

3. శ్రీ వాణి విద్యాపరిషత్, వేములవాడ.

# అంకితం

'ప్రజాబంధువు' శ్రీ కె. యస్. శర్మ
ఎం.ఏ., ఎమ్.యస్‌సి., ఐ.ఏ.యస్.
జిల్లా కలెక్టర్, కరీంనగర్ గారికి

శ్రీ కే, యస్, శర్మగారు
ఎంతో ఉత్తములు మీరు!
మంచుకన్న చల్లనైన
మంచి మనసు మీకున్నది!
మల్లెలకన్నా తెల్లని
ఉల్లము మీదైయున్నది.

కరీంనగరు మండలముకు
కలెక్టరైనట్టి మీరు
కర్షక కార్మిక జనులకు
హర్షమెంతొ కలిగిస్తూ
బీదసాదలను చాలా
ఆదరించి ప్రేమింతురు.

ప్రజలకు మేలునుచేస్తూ
ప్రగతినెంతొ సాధిస్తూ—
'మహామనీషిగ' మీరలు
మన్ననలను పొందినారు
'ప్రజాబంధువుగ' మిక్కిలి
ప్రశంసలను అందినారు.

కళాకారులను సతతము
కడు ప్రేమతో సత్కరిస్తు
సాహితీ సాంస్కృతికాది
సర్వకళలయందు తమరు
అభిమానం కలిగియుండి
ఆప్యాయత చూపింతురు!

బాలల సాహిత్యముపై
చాల ప్రేమ మీకున్నది
"బాలలోక"మను కావ్యము
మీకంకిత మిస్తున్నా-
'బాలబంధువుగ' మిమ్ముల
నేను గౌరవిస్తున్నా!

—ఎర్రోజు సత్యం





కె. యస్. శర్మ
ఎం.ఎ., ఎం.ఎస్‌సి., ఐ.ఎ.ఎస్.
జిల్లా కలెక్టర్, కరీంనగర్.

# స్వీకృతి

## శ్రీ ఎర్రోజు సత్యంగారికి "శుభాకాంక్షలు"

మీరు రచించిన "బాలలోకం" కృతిని స్వీకరించవలసిందిగా, మీరెంతో అభిమానంతో కోరారు. మీ ఆప్యాయతకు, అభిమానానికి సంతోషిస్తున్నాను.

ప్రభుత్వ అధికారులు ఇటువంటి స్వీకృతి చేయకూడదన్న నా సలహానుకూడా మీరు పక్కకునెట్టి పట్టుదలతో ఉన్నందువలన నాకీ అర్హత లేకపోయినా, బాలలోకాన్ని రచించిన మీ వాక్కు బ్రహ్మవాక్కుతో సమానమన్న ఉద్దేశ్యముతో మాత్రమే నేను అంగీకరిస్తున్నాను.

బాలసాహిత్యానికి మీరు చేస్తున్న కృషిని మనసారా అభినందిస్తున్నాను. మీరు ఇంకా ఎన్నో ఉత్తమ రచనలను చేయాలని ఆకాంక్షిస్తున్నాను.

13–3–1980

అభిమానంతో

కె. యస్. శర్మ

Dr. C. NARAYANA REDDY, M. A. Ph. D.
PROFESSOR OF TELUGU,
OSMANIA UNIVERSITY,
HYDERABAD-7.

Date 22-3-1980.

# అభిప్రాయం

చిరంజీవి ఎర్రోజు సత్యంకు

నీవు పంపిన "బాలలోకం" అందింది. సంతోషం. పిల్లలకోసం రాయవలసినది ఎంతైనావుంది. వాళ్లగురించి రాయాలంటే ముందు వాళ్ల పలుకుబడిని పట్టుకోవాలి.

పిల్లలు పాడుకోవడానికి వీలుగా నీవు ఈ పాటల్ని రచించావు. వాటిని పుస్తకరూపంలో తీసుకురావడానికి కరీంనగరంజిల్లా కలెక్టర్ శ్రీ కె. యస్. శర్మగారు అండగా ఉండడం అభినందనీయం. ఈ జిల్లాలో సాహిత్య వికాసానికి శ్రీ శర్మగారు నిర్వహిస్తున్న పాత్ర శ్లాఘ్యం, అనర్ఘం.

— సి. నారాయణరెడ్డి.

**DR. M. CHANNA REDDY**
CHIEF MINISTER

HYDERABAD
DATED 27-3-1980

My dear Sri Satyam,

Received your letter of 19th instant. I thank you for the nice sentiments expressed by you in it. I appreciate your venture of bringing out books for the benefit of children. I wish your endeavour all success.

with best wishes,

*Yours sincerely,*

M. CHANNA REDDY

Sri ARROJU SATYAM,
Telugu Pandit,
Racherla Boppapoor-505 305.

డా॥ వక్కలంక శేషగిరిరావు,
గౌరవాధ్యక్షులు,
త్యాగరాజ లలిత కళాపరిషత్,
కరీంనగర్.

Date: 16-5-1980

# సందేశము

శ్రీ ఎరోజు సత్యం గారికి,

మీరు రచించిన "బాల లోకం" చదివి సంతోషించాను. బాలల సాహిత్యం అభివృద్ధి చేయడంలో ఇంకా మీరు కృషి చేయగలరని విశ్వసిస్తున్నాను.

మీ కలంనుండి బాలలకొరకు కథానికలు, నాటికలు గూడా వెలువడగలవని ఆశిస్తున్నాను.

ఇట్లు

వక్కలంక శేషగిరిరావు.

శ్రీ వాగీశ్వర్యైనమః

# పీఠిక

అభినవపోతన

**డా॥ వానమామలై వరదాచార్యులు**
**M.L.C.**

శ్రీ యెట్టోజు సత్యంగారు ఉపాధ్యాయులై బాలురతో నిత్య సన్నిహిత సంబంధము గల్గియుండుటచే చక్కని బాలసాహిత్యం బాలురకవసరమగు హితోపదేశ పూర్వకముగా తదనుగుణ్యమగు భాషా భావములతో గూర్చి ముచ్చటగా వ్రాయుచున్నారు.

వీరిదివరలో 'పిల్లల పాటలు' అను బాల సాహిత్య కావ్య ఖండికల వ్రాసి సహృదయుల మెప్పువడసినారు. ఈనాడు తెనుగు భాషలో బాలసాహిత్యము చాలినంత రాలేదనే చెప్పవలెను. ఆ లోటును దీసివేయుటకు పాటుబడు వారిలో శ్రీ యెట్టోజు సత్యం గారు ముఖ్యులలో నొక్కరు. జానపద సాహిత్యము, బాలసాహిత్యము అజ్ఞులగు, పల్లీయులకు, బాలురకు చాలా ఉపకరించగల వనుట నగ్నసత్యము. శ్రీ సత్యముగారీ సత్యమును గ్రహించి భావి భారత పౌరులగు బాలుర తీర్చిదిద్దుటకై యీ "బాలలోకం" అను పిల్లల గేయాలను వ్రాసినారు.

ఈ బాలలోకం లోని పాటల నన్నింటిని చదివినాను. భాష బాలురకనుకూలించు సులభపదగ్రథితమై యున్నది. భావములు సహజకోమల విలాసగతుల నడయాడినవి. బడికిపోయి విద్యను నేర్చెదెందుకు? అనే శీర్షికలో జ్ఞానము నేర్చి ప్రగతిని సాధించి దేశ సౌభాగ్యము పెంపొందించుటకే యని ఐకమత్యముతో క్రమశిక్షణ గలిగి మెలగవలెను. ప్రబుద్ధులమై మంచివారికే ఓటు వేసి గెలపించ వలెను. వికలాంగులకు సహాయము చేయవలెను ధనము కన్న విద్యాధనమే గొప్పది. దొంగతనము చేయరాదు. దుష్టవ్యసనముల కు లోనుగారాదు. ఇలాంటి హితోపదేశాలు ప్రియమగు పాటలుగా మలచి బాలురకు అందించిన శ్రీ సత్యముగారెంతో ధన్యజీవులు.

ఇక అధికారులెందరో ఉన్నారు. సమర్థులైనవారున్నారు. కాని కళారాధకులు కళాప్రోత్సాహకులు లభించుట అరుదు. కరీంనగరం జిల్లావారి భాగ్యవిశేషములతో గౌరవనీయులు శ్రీ కే. యస్ శర్మ గారట్టి వారై లభించినారు. ఈ గ్రంథానికి వారే కృతి భర్తలు అగుట సహజమే. ఈ కృతికర్తకు. కృతిభర్తకు శతాయురారోగ్య భాగ్యాలు గల్గుగాక!



# ముందు మాటలు

బాల సాహిత్యం మనకు చాలినంత లేదు. నాకున్న కొద్ది పాటి జ్ఞానంతో బాలసాహిత్యాభివృద్ధికి ఉడతాభక్తిలా తోడ్పడాలన్న సదుద్దేశము నాకు కలిగింది. ఆ ఉద్దేశ్యముతోనే "పిల్లల పాటలు" పుస్తకాన్ని అచ్చుచేయించాలని ప్రయత్నించాను. నా ప్రయత్నాన్ని మెచ్చుకుంటూ అనేక మంది పెద్దలు, పిన్నలు, బంధువులు, మిత్రులు, ఉపాధ్యాయ సోదరులు ఆర్థికంగా, హార్థికంగా, ప్రోత్స హించారు. వారి ప్రోత్సాహముతోనే 1978 ఏప్రిల్ లో "పిల్లల పాటలు" పుస్తకమును అచ్చు చేయించాను. ఆ పుస్తకం అందరి మన్ననలను అందుకొని ఆరు నెలలలోనే రెండవ ముద్రణకు నోచు కొని మూడవ ముద్రణలోకి అడుగిడబోతుంది. ఈ విజయం నా ఒక్కనిది కాదు. "పిల్లల పాటలు" పుస్తకానికి ప్రత్యక్షంగా పరోక్షంగా సహకరించిన ప్రతి ఒక్కరికి చెందుతుంది.

1979 లో అంతర్జాతీయ బాలల సంవత్సర సందర్భమును పురస్కరించుకొని 'బాలలోకం' పుస్తకాన్ని అచ్చు చేయించాలను కున్నాను. గౌరవనీయులైన జిల్లాకలెక్టర్ కరీంనగరం గారిని ఆర్థిక సహాయం కోరాను. సహృదయులు, సాహితీప్రియులైన శ్రీ కె. యస్. శర్మ జిల్లా కలెక్టర్ గారు నా 'బాలలోకం' పుస్తకం వ్రాత ప్రతిని శ్రద్ధాసక్తులతో చదివి దానిలోని పాటలు బాగున్నాయని నన్ను ఆర్థికంగా, హార్థికంగా ప్రోత్సహించి పుస్తకం లోని ప్రతి పాటకు తగిన విధంగా బొమ్మల్ని వేయించి పిల్లలకు తగినట్లు పుస్త కాన్ని అచ్చు చేయించారు. ఈ విధంగా బాలసాహిత్య నిర్మాణానికి పెద్దలు తోడ్పడితే బాల సాహిత్యం దినదినాభివృద్ధి చెంది మూడు పూవులు ఆరు కాయలై వర్థిల్లుతుంది.

సహృదయులు, సాహిత్యాభిమానులు, 'ప్రజా బంధు', 'కరీంనగర్ జిల్లా శ్రేయోభిలాషులు' అయిన శ్రీ కె. యస్. శర్మ జిల్లా కలెక్టర్ కరీంనగర్ గారికి ఈ "బాలలోకం" పుస్తకమును అంకితం చేయడం సముచితమైనదని భావిస్తున్నాను.

అభిమానాన్ని మన్నించి అంకిత స్వీకారానికి అంగీకరించిన అమృత హృదయులు శ్రీ కే. యస్. శర్మ గారికి హృదయ పూర్వక కృతజ్ఞతాంజలులు.

నైతిక విజ్ఞానాన్ని పిల్లతనం నుండి కలిగిస్తేనే అది చెరగని ముద్రవలె పిల్లల హృదయాల్లో అచ్చుపడి ఉంటుందన్న ఉద్దేశంతో పెద్దలకు సంబంధించిన కొన్ని పాటల్ని కూడా ఇందులో చేర్చడం జరిగింది. ఈ విషయాన్ని పెద్దలు గమనించగలరని ప్రార్థన.

ప్రతిపాటలో నీతిని బోధిస్తూ ఈ పుస్తకం ద్వారా పిల్లలకు మంచిని తెలుపడానికి ప్రయత్నించాను. పిల్లలు పాడుకోవడానికి వీలుగా వారికి అర్థమయ్యేవిధంగా సుబోధశైలిలో ఈ పాటల్ని రచించాను. ఇంకా గురువర్యులు శ్రీ డా॥ సి. నారాయణరెడ్డి గారు చెప్పినట్లు పిల్లల పలుకుబడిని పట్టుకొని బాల సాహిత్యానికి రచనలు చేస్తాను. ఈ పుస్తకంలోని పాటలు పిల్లలకు ఏ మాత్రం పనికి వచ్చినా చాలు. నా రచనా ధ్యేయం నెరవేరినట్లే.

పెద్దల ఆశీస్సులను, పిన్నల ప్రేమాభిమానాలను పొందుతూ బంధుమిత్రుల అండదండల నందుకొంటూ నా వృత్తి ధర్మాన్ని సక్రమంగా నిర్వహిస్తూ సాహిత్య, సాంస్కృతిక రంగాలలో ముందు కేగ ప్రయత్నిస్తుంటాను.

— ఎర్రోజు సత్యం

# కృతజ్ఞతలు

అనేక కార్యాంతరమగ్నులై యుండియు నేను పంపించిన 'బాలలోకం' పుస్తకమును, లేఖను చదువుకొని దయతో నా యీ ప్రయత్నాన్ని అభినందిస్తూ ఇంకా నా ప్రయత్నాలన్ని విజయవంతం కావాలని ఆశించిన ప్రజానాయకులు, ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ గౌ॥ డా॥ మర్రి చెన్నారెడ్డి గారికీ —

నా కోరికను మన్నించి అమూల్యమైన అభిప్రాయాన్ని పంపించిన గురుతుల్యులు, ఆధునికాంధ్రకవి మూర్ధన్యులు, పద్మశ్రీ డా॥సి. నారాయణరెడ్డి గారికీ —

నా ప్రార్థననాలకించి ప్రియమార పీఠికాలంకారం కలిగించిన, "మహాకవి శిరోమణి", అభినవపోతన" శ్రీ డా॥ వానమామలై వరదాచార్యుల గారికీ —

ఆత్మీయంగా ఆదరించి అడిగినంతనే చక్కని సందేశము నందించిన త్యాగరాజ లలితకళా పరిషత్ గౌరవాధ్యక్షులు శ్రీ డా॥వి. శేషగిరిరావు గారికీ —

ఎన్ని పనులున్నప్పటికినీ ఈ పుస్తకం అచ్చు విషయంలో ఎంతో శ్రద్ధవహించిన నెహ్రూయువక కేంద్రం సంచాలకులు శ్రీ రామారావు గారికీ —

తమ రెండవ ప్రచురణగా ఈ పుస్తకమును వెలువరింపజేసిన శ్రీ త్యాగరాజ లలితకళా పరిషత్ కరీంనగర్ వారికీ —

హార్దికంగా ప్రోత్సహించిన D.E.O. శ్రీ యం. ధర్మయ్య, ఆడిట్ ఆఫీసర్ శ్రీ రామ్ గోపాల్ రావు, B.D.O. శ్రీ కె. మల్లయ్య, తహసిల్‌దారు శ్రీ సి. యస్. మూర్తి, శ్రీ వి. వెంకట్ రెడ్డి, శ్రీ యన్. వెంకటరెడ్డి, శ్రీ డా॥ యం. రఘుపతి రావు, శ్రీ కుడి క్యాల లింగయ్య గార్లకూ –

అందంగా బొమ్మల్ని గీసి ఇచ్చిన ఆర్టిస్ట్ ఆగాచార్య గారికీ –

ఆకర్షణీయంగా పుస్తకాన్ని ముద్రించి ఇచ్చిన శారద ప్రింటర్స్ ప్రొప్రయిటర్ శ్రీ నాగభూషణం గారికీ –

ఈ పుస్తకం ఇలా వెలుగులోకి రావడానికి ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకరించిన వారందరికీ –

నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

– ఎర్రోజు సత్యం

# విషయ సూచిక

16. పిసినారి రంగయ్య.

17. చదువే కదా ఆయుధం!

18 ఎంతో ఎంతో ముఖ్యం.

19. చెట్టు.

20. తగదు గర్వమని చెప్పారు.

21. పరిశుభ్రత పాటించాలి.

22. క్రమశిక్షణతో మెదలాలి.

23. కట్నం రూపుమాపండి.

24. పొలాల బేరం చేశాడు

25. ఇతరులు మెచ్చగా నడవాలి.

26. కొండెములు చెప్పరాదు.

27. పిసినిగొట్టు తాత.

28. కుక్క.

29. శివ శివ అంటూ తిరిగేరు!

30. ఏది గొప్ప?




# 1. బడికి పోయేదెందుకురా?

బడికిపోయే దెందుకురా?
చదువులు నేర్చేటందుకురా!

చదువులు నేర్చేదెందుకురా?
జ్ఞానం పొందేటందుకురా!

జ్ఞానం పొందేదెందుకురా?
ప్రగతిని పెంచేటందుకురా!

ప్రగతిని పెంచేదెందుకురా?
సుఖములు పొందేటందుకురా!

# 2. బాలలోకం



బాల లోకము మాదండి
భావి పౌరులం మేమండి
మంచి నడవడి నేర్చుకొని
మంచి పౌరులుగ ఎదిగెదము.

వేళ తప్పక బడికి పోవుచూ
గురువుల మన్నన నందెదము
పాఠాలన్నీ బాగా చదువుచు
ఫస్టు మార్కులను పొందెదము.

రోజు రోజుకు తెలివి పెంచుకొని
రోజాలా వికసించెదము
గాంధీ, నెహ్రూజీ చూపిన బాటలో
అందర మొకటై నడచెదము.

ఇంటా బయటా మంచిపేరుతో
ఎంతగానో రాణించెదము
జన్మభూమికి సేవచేయుటకు
చక్కగ ఎదుగుతు సాగెదము.

# 3. అందరమొకటై నడవాలి

చేయీ చేయి కలుపుకొనీ
అందరమొకటై నడవాలి.
చీకూ చింతా మానుకొనీ
ఆనందంతో పాడాలి.



కల్లా కపటం వదులుకొనీ
ఎల్లరి సుఖమును కోరాలి,
మంచీ మమతా పెంచుకొనీ
మంచివారిమై బ్రతుకాలి.

# 4. దేశసేవను చేస్తాను



నేడు నేను బాలుడను
రేపు భరత పౌరుడను
రేపు —
డాక్టరు నేనైతే—
రోగుల సేవ చేస్తాను.

లాయరు నేనైతే—
న్యాయాన్నెప్పుడు గెలిపిస్తాను.

గురువును నేనైతే—
పాఠాల్ చక్కగ చెప్తాను.

కవిని నేనైతే—
కావ్యాలు మంచివి వ్రాస్తాను.

ప్రజానాయకుడ నేనైతే—
ప్రజలకు సేవను చేస్తాను.

కిషాన్ను నేనైతే—
పంటలు బాగా పండిస్తాను.

జవాన్ను నేనైతే—
జన్మభూమిని రక్షిస్తాను.

ఎక్కడున్నా ఏమిచేసినా—
నీతితో నడచుకుంటాను,
దేశసేవను చేస్తాను.

# 5. మంచివారికేయాలి ఓటు



వేయాలీ వేయాలీ ఓటూ
మంచివారికేయాలి ఓటు
విలువైనది విలువైనది ఓటు
విచారించి వేయకుంటె చేటు

ఏదోపోనీ అంటూ
ఎవరికో ఓటును వేస్తే—
ఎంతోనష్టము కలుగును
దేశప్రగతి కుంటుపడును
వేయాలీ వేయాలీ ఓటూ
మంచివారికేయాలీ ఓటు.

నోటుకాశపడి నీవు
ఓటును వేశావంటే—
నోట్లోన దుమ్ముకొట్టి
పొట్లెన్నో కలిగింతురు
వేయాలీ వేయాలీ ఓటూ
మంచివారికేయాలి ఓటు.

మాయమాటలను చెప్పేవారి
మర్మమును దెలసీ—
ఓటు వేయకుండ వారి
నోడించి తీరాలి
వేయాలీ వేయాలీ ఓటూ
మంచివారికేయాలి ఓటు.

ప్రజల మేలు కోరువారు
ప్రజ్ఞ కలిగియున్నవారు
వారె మంచి నాయకులు
నీ ఓటుకు తగినవారు
వేయాలీ వేయాలీ ఓటూ
మంచివారికేయాలి ఓటు.

పేదల మేలును కోరే
పెద్దమనిషి నెన్నుకో—
మంచితనం పెంచునట్టి
మంచి మనిషి నెన్నుకో—
వేయాలీ వెయాలీ ఓటూ

# 6. ఇద్దరము మేమిద్దరము



మా ఇంటిలో పిల్లలము
ఇద్దరము మేమిద్దరము
నా పేరేమో కరుణ
మా చెల్లెలు పేరు అరుణ
నేను చదివేది ఆరవది
మా చెల్లెలు చదువును మూడవది

ఆడపిల్లలము మేమైనా
అమ్మా నాన్న మమ్మలనూ
ఎంతగానో ప్రేమిస్తారు
మా ప్రగతినెంతో కాంక్షిస్తారు

బిడ్డలు కొడుకులు సమానమేనను
దొడ్డబుద్ధిగల మా తలిదండ్రులు
కొడుకులు లేరను చింతను ఆసలే
చెంతకు చేరనీయరు

చిన్న కుటుంబమె మేలంటూ
సంతోషం చిలికించెదరు
చీకూచింతలు లేకుండా
చక్కాగ మమ్ముల పెంచెదరు

ఆడపిల్లలం అనుకోకుండా
అన్నిటిలోన ముందడుగేస్తూ
ప్రగతినెంతో సాధిస్తాము
దేశసేవను చేస్తాము.

# 7. దొంగొకనాడు దొరుకకపోడు

రాజాలాగా బ్రతుకాలంటూ—
రాజు కోర్కెలను పెంచుకునేను
చేతిలో డబ్బులు లేకపోవుటచె
ఎంతగానో చింతిల్లుచుండెను.

దొంగతనమ్మును చేయుటకలవడి
రాజు డబ్బులు పొందుచుండెను
మంచి బట్టలతో మంచి తిండితో
రాజాలాగా బ్రతుకుచుండెను.

దొంగతనమ్ము చేయుచుండగా
దొరికిపోయెను రాజొకనాడు
చెట్టుకుకట్టివేసిరి పెద్దలు
కొట్టుతు తిట్టుతు బుద్ధిచెప్పిరి.

దొంగొకనాడు దొరుకకపోడు
అప్పుడు బాధకు గురిఔతాడు
దొంగతనమ్మును చేయుటతప్పు
చేసినవారికి తప్పదుముప్పు.



# 8. తగిన వేళలో ఆటాలి

ఎండనకా వాననకా
రంగడు ఎప్పుడు ఆటలాడును
మండేఎండలో ఆడుటవలన
రంగని ఆరోగ్యం చెడిపోయెను
దవాఖానకు తీసికెళ్ళితే—
డాక్టరు చాలా మందలించెను.
మందులనిచ్చి బాగుచేసెను.
ఎండలో ఆడుట ఆరోగ్యానికి
ఎంతో చేటని చెప్పిరి డాక్టరు.



ఎల్ల వేళల ఆటలాడితే—
మంచిదికాదు ఎవ్వరికి.
తగిన వేళలో ఆటలాడితే
చాలా మంచిది ఆరోగ్యానికి.

# 9. గ్రుడ్డివారిని-కుంటివారిని

గ్రుడ్డివారిని కుంటివారిని
ప్రేమించాలి ప్రేమించాలి
చేతనైన సహాయము చేసి
సేవించాలి సేవించాలి.



మానవసేవే మాధవసేవని
తెలియాలి తెలియాలి
రోగులపైనా జాలిచూపుతూ
ఆదుకొనాలి ఆదుకొనాలి.

బీదసాదలను చీదరించక
కరుణించాలి కరుణించాలి
సహకారంతో సద్భావముతో
ఆదుకొనాలి ఆదుకొనాలి.

మనిషి అన్నదే మన కులమంచు
మెదలాలి మెదలాలి
మంచి అన్నదే మన మతమంచు
సాగాలి సాగాలి.

# 10. బడాయి కుక్క!

బడాయి కుక్క! బౌబౌ అంటూ—
పగలు చాలా మొరిగేను
అందరు తనకు భయపడెదరని
ఎందరెందరికో చెప్పేను
రాత్రిమాత్రము సందిలో దాగి
దొంగల చూచి ఉరికేను.



దొంగల కాయని కుక్కలెందుకు ?
పనికిరాని పగలరుపులెందుకు ?
పనికిరాని పనులెప్పుడు చేయుట
తగదూ తగదు
పనికొచ్చే పనులెప్పుడు మానుట
వలదూ వలదు.

# 11. ఆనందం చిలికిస్తాను!




ఆమ్మా బడికి వెళ్ళాను
పాఠాలన్నీ చదివాను
పాటలుపాడి మురిశాను
ఆటలుఆడి అలిశాను
ఆకలితీరగ తింటాను
హాయిగ నిద్దురపోతాను
ఆరోగ్యంతో ఉంటాను
ఆనందం చిలికిస్తాను !

# 12. త్రాగరాదురా కల్లు

త్రాగరాదురా కల్లు—త్రాగరాదురా
కల్లు సార త్రాగినోని—ఇల్లంతా గుల్లౌను
త్రాగరాదురా కల్లు త్రాగరాదురా
ఆరోగ్యం చెడిపోయి—ఆనందం కరువౌను
ఉన్నఆస్తి ఊడిపోయి—ఎన్నెన్నో బాధలౌను
త్రాగరాదురా కల్లు త్రాగరాదురా.
పశులముందు అవమానం—పదేపదేజరుగుచుండు
త్రాగినోనిమాటనెవరు—కలనైనా నమ్మబోరు
త్రాగరాదురా కల్లు—త్రాగరాదురా.
కల్లుసార మరిచిపోతె—ఇల్లెంతో బాగుపడును
పదుగురిలో మంచిపేరు—అదేపనిగ వచ్చుచుండు
త్రాగరాదురా కల్లు—త్రాగరాదురా.



# 13. పరులబాగును కోరాలి

పరుల బాగును ఓర్వని రంగడు
పాపం చింతతో కుములుచుండును
పరుల మేలును కోరే రాముడు
పరమానందం చెందుచుండును



అసూయ గుణమును కలిగినవాడు—
అయ్యో బాధతో కుములును చూడు
పరుల బాగును కోరాలి
తానుకూడ పైకెదగాలి.

# 14. ఆకులాట

ఆకులాటలో అంతయ్యెంతో
ఆస్తిని కరాబు చేశాడు
అయినాగాని ఆకులాటను
అసలే మానివేయడు.



తిండీతిప్పలు మానుకొనీ
రాత్రింబవళ్ళు ఆడుచుండును
సమయాన్నంతా పాడుచేయును
భార్యాపిల్లల బాధపెట్టును.

ఆకులాటకు అలవడిపోతే_
అయ్యో కలుగును కష్టము
చెడు అలవాట్లకు గురికారాదు
చింతతొ కుమిలిపోవుట వలదు.

# 15. అవసరము ప్రతి మనిషికి



చెడ్డపనులను చేయుటలోన
ఆరితేరెను రంగన్నా
మంచి పనులను చేయాలంటే
వాడి ఒంటికి పడదన్నా
రంగడుఅంటే చెడ్డవాడనీ
పేరుపొందెను రంగన్న

ఒకనాడేమి జరిగిందంటే
చెప్తాను మీరందరు వింటె—
ధనికునింటిలో దొంగలుపడిరి
దొరికిన సొమ్మును దోచుకుపోయిరి
రంగడె సొమ్మును దొంగిలించెనని
రంగని విరిచి కట్టివేసిరి
సొమ్మునిమ్మని కొట్టసాగిరి

ఎంత ఏడ్చినా రంగనిపైన
దయరాలేదు ఎవ్వరికి
చెడ్డవాడని రంగనిపైన
ఎంతోకోపం అందరికి

చెడ్డపేరును పొందిన పిదప
చేటు తప్పదు ఎప్పటికీ
అందుకె మంచి పేరును పొందుట
అవసరము ప్రతి మనిషికి.

# 16. పిసినారి రంగయ్య



పిల్లికీ పిడుచైన వేయడని
పేరుపొందెను రంగయ్యా
పిసినారి మన రంగయ్యా
కూతురు పెళ్ళి చేసెనయా.

బాగా అతిథులు వచ్చారనుకొని
బావురుమనెను రంగయ్యా
వచ్చినవారిని పలుకరించకా
వెచ్చవెచ్చగా చూశాడు
ఖర్చౌననని చింతించాడు,

బియ్యంలోన రాళ్ళను గలిపి
అన్నమునూ వండించాడు,
ఉప్పును బాగా కూరలొగలిపి
విషముగ తయారుచేశాడు.

చక్కగలేని వంటల చూచి
బుక్కెడుకూడా తినలేదెవ్వరు
చీచీ అంటూ తూతూ అంటూ
అందరు తిట్టిరి రంగయనూ.

ఎంత తిట్టినా ఏమిచేసినా—
సహనం వహించె రంగయ్యా
పిసినారి మన రంగయ్య.

వచ్చిన కట్నాలను చూచుకొని
ముచ్చటపడెను రంగయ్య
వంటసరకులు తరుగనందుకు
మురిసిపోయెను రంగయ్య
పిసినిగొట్టు మన రంగయ్య.

శుభకార్యాలలో తగిన విధంగా
ఖర్చు చేయుటకు వెరువద్దు
వచ్చిన అతిథుల నెంతోమంచిగ
ఆదరించుటను మరువద్దు.

# 17. చదువేకదా ఆయుధం!



వీడాలీ వీడాలీ
అజ్ఞానం వీడాలి.
పొందాలీ పొందాలీ
విజ్ఞానం పొందాలి.

అజ్ఞానం వీడుటకు
విజ్ఞానం పొందుటకు
చదువేకదా ఆయుధం
అదేకదా మనకు ధనం

ప్రతి మనిషి చదువుకొనీ
ప్రగతిని సాధించాలి
నిరక్షరాస్యతను
నిర్మూలం చేయాలి.

# 18. ఎంతో ఎంతో ముఖ్యం



మంచిబట్టలను కట్టుకొనీ
నగలను బాగా పెట్టుకొని
ఆడంబరముగా జీవిస్తూ
ఆడపెత్తనం ఎంతోచేస్తూ
మోహిని అయ్యో భర్త మొద్దని
లొంగదీసుకొని అణగద్రొక్కను
పాడునడకతో మెదులుచుండును
అందుకె చెడ్డపేరును పొందెను

అత్తను మామను భర్తను అరుణ
అసలే విలువచేయదు
మంచి గుణాలను చెప్పేవారిని
ఎంతగానొ ద్వేషిస్తుంది
చెడ్డమాటలను చెప్పేవారిని
ఎంతెంతో ప్రేమిస్తుంది
బిత్తిరి బింగిరి నడకతొ అరుణ
పుట్టినింటివారిని పొగడేయును
మెట్టినింటివారిని నిందించును
అరుణను అందరు అసహ్యించుకొని
ఎంతో చులకన చేయుచుందురు
పురుగువలె విదిలించుచుందురు

అత్తమామలకు సేవనుచేస్తూ
భర్తకు ఎంతో విలువను ఇస్తూ
అతిథుల నందరి మంచిగచూస్తూ
ఎంతోమంచి నడకతొ మెదులుచు
అందరిలోన మన్నన నందుచు
నిరాడంబరముగా జీవించే
నిర్మల ఎంతో మంచిపేరును
పొందుచుండెను అందరిలోన
అందుకె విలువ ఆమెకు చాన

మంచినడవడి కలిగిన ఆడది
ఉండేఇల్లు స్వర్గం!
మంచినడవడి లేని ఆడది
చేయును ఇల్లును నరకం !
బట్టలు మంచివి కడితే చాలదు
నగలను బాగా పెడితే చాలదు
ఆడదానికి మంచినడవడి
ఎంతో ఎంతో ముఖ్యం.



# 19. చెట్టు

ఆకులనిచ్చును పువ్వులనిచ్చును
నీడనిచ్చును ఫలములనిచ్చును
పరులకోసమే తాను బ్రతుకును
ఏమిటి బాబూ ?
అది ఏమిటి బాబు ?
చెట్టు అది చెట్టు
శభాశ్ ! !



మనముకూడ చెట్టువలెనే –
పరులకోసమై బ్రతకాలి
మంచితనమునే పెంచాలి
మాన్యులమై జీవించాలి
ఏమంటావు ? నువ్వేమంటావు ?
ఔనంటాను నేను ఔనంటాను
చెట్టు గుణముతే నేర్చెదను
పరులకోసమై బ్రతికెదను
పరమాత్ముని ప్రేమను పొందెదను!

# 20. తగదు గర్వమని చెప్పారు




రంగడు చాలా బలవంతుడనని
పొంగిపోతు గర్వించుచుండును
తరగతిలోన పిల్లలందరితో
ఎప్పుడు చూచిన పోట్లాడును
తరగతిలోన ఏ ఒక్కరు
తగరు రంగని ఓడించుటకు
తరగతిలోని పిల్లలందరు
మురళి మాటను విన్నారు
ఒక్కసారిగా రంగనిపై బడి
ఓడించీ మదమణచారు
నేనేగొప్పను గర్వంవద్దు
ఐకమత్యమే ఎంతోముద్దు

# 21. పరిశుభ్రత పాటించాలి



పరిశుభ్రంగా ఉండని సోమడు
ముఖం కడుగడు స్నానంచేయడు
చింపిరితలతో మురికి బట్టలతో
గోకుడు పుండ్లను గీకె సోమును
ఎవ్వరు దగ్గర చేరనీయకా
ఎంతో చులకన చేయుచుందురు
పరిశుభ్రంగా లేనివారిని
ఎవ్వరు దగ్గర చేరనీయకా—
ఎంతో చులకన చేయుచుందురు
పురుగువలె ఏదిలించుచుందురు
పరిశుభ్రంగా ఉండనివారు
అనారోగ్యముతో అలమటింతురు
పరిశుభ్రంగా ఉండేవారు
ఆరోగ్యముతో మురియుచుందురు
అందుకని మరి అందుకనీ
ఉత్సాహముతో ఉదయమె లేచి-
కాలకృత్యములు తీర్చుకొని,
ముఖము శుభ్రముగా కడగాలి
చక్కగ స్నానం చేయాలి
ఉతకిన బట్టల తొడగాలి
పరిశుభ్రత పాటించాలి
ఆరోగ్యంతో ఉండాలి.

# 22. క్రమశిక్షణతో మెదలాలి

క్రమ శిక్షణతో మెదలని మనిషి
బద్ధకముతో చెడిపోతాడు
క్రమశిక్షణతో మెదిలే మనిషి
చురుకుదనం కలిగుంటాడు
ప్రగతిబాట పయనిస్తాడు
అందుకని మరి అందుకనీ—



క్రమశిక్షణతో మెలగాలి
ప్రగతినేతో సాధించాలి

# 23. కట్నం రూపుమాపండి



పెళ్ళీ పెళ్ళీ బొమ్మల పెళ్ళీ
రండీ మీరు మళ్ళీ ! మళ్ళీ !!
కట్నాలనలే ఇవ్వము
కర్కశ గుణముతో మెదులము
కలహాలతో మేమెప్పుడు
కళ్యాణాన్ని జరుపము

వియ్యంకులము ముద్దుగఉంటూ—
వినయాన్నెంతో చూపెదము
వచ్చీపోయే వారిమటంచు—
ముందుచూపుతో నడచెదము

పిల్లలమైన మేమూ
పెళ్ళి మంచిగా జరిపెదము
సంతోషం చిలికించెదము
పెద్దలార ఓ పెద్దల్లారా
మీరుకూడా పెళ్ళిల్లు
మంచిగ జరుపుతు ఉండండి
కట్నం రూపుమాపండి
కలతలను తొలగించండి

# 24. పొలాల బేరం చేశాడు



కూలినాలితో బ్రతికే కొమురడు
రోజు త్రాగనిదె అసలే నిలువడు
త్రాగుత ఊగుత తైతక్కలతో
గ్రామాధికారిని చేరాడు
పొలాల బేరం చేశాడు
చూచినవారు నవ్వుతుంటే
పిచ్చివారని అరిశాడు
పైసేలేని కొమురడు

త్రాగినవాడికి ఏది తెలియదు
అందుకె అతడికి విలువదొరుకదు
త్రాగుత చులకన పొందుట తప్పు
త్రాగక విలువను పొందుటె మెప్పు

# 25. ఇతరులు మెచ్చగ నడవాలి

రామయ్యకు ఉన్నారు ఇద్దరు కోడండ్లు
పెద్దకోడలు పేరు సుందరి
చిన్నకోడలు పేరు మంజరి

అందాల రాణి నటంచూ—
సుందరికెంతో గర్వం
అద్దముముందు అలంకరించుకొనుచే—
ఆమెకు సర్వం
ఇంటిలోని వారెవ్వరికీ
నచ్చదులే ఆమె గుణం



చిన్నకోడలు మంజరి మాత్రం
అన్ని పనులను చేయుచుండును
అందరి ప్రేమను పొందుచుండును
నిరాడంబరముగా జీవించును
చక్కదనంగా ఉంటే చాలదు
చక్కగ పనులు చేయాలీ
ఇంటిలిపాది ప్రేమనందుకొని—
ఇతరులు మెచ్చగ నడవాలి

# 26. కొండెములు చెప్పరాదు

ఇక్కడి మాటలు అక్కడ చెప్పుతు
అక్కడి మాటలు ఇక్కడ చెప్పుతు
కలహాల్ రేపే కమలాకర్‌ని
ఎవ్వరు దగ్గర చేరనీయక
ఎంతో చులకన చేయుచుందురు
పురుగువలే విదిలించుచుందురు
అందుకని మరి అందుకనీ—
కొండెము లెప్పుడు చెప్పుట తగదు
కలహాల్ రేపుట వలదు వలదు.



# 27. పిసినిగొట్టు తాత



తాతా ! తాతా ! ఓ తాతా !!
పిసినిగొట్టువు మా తాతా !
దాన ధర్మములు అసలే చేయవు
ఎవరిని దగ్గర చేరనీయవు
పిల్లికి పిడుచను వేయనీవు
పైసే ప్రాణం అంటావు
ప్రాణం పోయిన తర్వాత
అయ్యో! అయ్యో! ఓ తాతా !!
వెంబడు రావు పైసలు
వచ్చునులే నీ గుణములు
పీసిడితనమును వదులుము తాతా!
అందరిపైన చూపుము మమత !!!



# 28. కుక్క

కుక్కకు బుక్కెడు అన్నంవేస్తే
చక్కని సేవ చేస్తుంది
మక్కువను చూపిస్తుంది
ఇంటి కావలి కాస్తుంది
దొంగల తరిమి వేస్తుంది
మనుషులకన్నా కుక్కే నయమని
మంచినడకతో చెబుతుంది
విశ్వాసంతో మెదిలేకుక్కను
విలువచేయుటే మంచిదది.

# 29. శివ శివ అంటూ తిరిగేరు




మీసం గడ్డం పెంచుకొనీ
దేశాలెన్నో తిరిగామంటూ—
మాయమాటలను చెప్పే గురువులు
మా ఊరొకనాడొచ్చారు.
స్వార్థం మోసం పనికిరావనీ
చాలా చాలా చెప్పారు
చీకటిలోన చేతులు మార్చుతు
శివ శివ అంటూ తిరిగారు

చెడ్డపనులను చేయరాదని
దొడ్డబుద్ధులను చెప్పారు
చాటుగ దొమ్మరి గుడిసెలొజేరి
సరసాల్లోన మునిగారు.

పరులకు నీతులు చెప్పుటలోన
ఫస్ట్ మార్కులను పొందేరు
చెప్పేనీతులు చేయుటలోన
చివరి సంఖ్యలో చేరేరు.

నీతులు చెప్పుతు గోతులు త్రవ్వే
వారికి బుద్ధిని చెప్పాలి
మంచి నడకతో మెదిలేవారిని
మనసారా పూజించాలి.



# 30. ఏది గొప్ప?



చదువు గొప్పనా ?
ధనము గొప్పనా ?
ఏది గొప్ప? ఏది గొప్ప?
చదువే గొప్ప!
చదువే గొప్ప!
గుణము గొప్పనా ?
ధనము గొప్పనా?
ఏది గొప్ప? ఏది గొప్ప?
గుణమే గొప్ప!
గుణమే గొప్ప!!

గొప్పదికాని ధనము కోసము-
తప్పుపనులను చేయుట తగదు
ధర్మం న్యాయం వీడగ వలదు
ధర్మం న్యాయం వీడక మనిషి
ధనమును సంపాదించాలి
చదువులు బాగా చదువుకొని
తెలివిని చాలా పెంచాలి
మంచి గుణముతో మెదలాలి
దేశ సేవను చెయాలి.

